# భారత జాతీయ జండా

## చరిత్ర

## ( 1905 — 1947 )

"పద్మ విభూషణ్" ఆంధ్ర పితామహ

శ్రీ మాడపాటి హనుమంతరావుగారి తొలిపలుకుతో

పింగళి పరశురామయ్యచే రచింపబడినది



[ మూల్యం : అర్ధరూపాయి

# తొలి పలుకు

నా చిరమిత్రులగు శ్రీ పింగళి వేంకయ్యాగారి పుత్రులును, విఖ్యాతులును నగు శ్రీ పరశురామయ్యాగారిచే రచింపబడిన "భారత జాతీయ జండా చరిత్ర" అను నీ పుస్తకమునకు తొలిపలుకు వ్రాయు నవకాశము లభించినందునకు ఎంతయో సంతోషించుచున్నాను.

పుటల సంఖ్యనుబట్టి చాల చిన్నదేయైనను, విషయ ప్రాధాన్యమునుబట్టి గొప్పదిగా నెన్నదగిన యీ పుస్తకమున, భారత జాతీయపతాక యోజనమునుగురించినచరిత్ర సంగ్రహముగ వర్ణింపబడినది. దీనిలో మన పతాకము యొక్క ఉపయోగ విధానములుగూడ చూపబడినవి. ఇవి ప్రతివ్యక్తియు గ్రహించి మనస్థగితములు చేసికొనదగిన యంశములు. తెలుగున వ్రాయబడిన ఈ చిన్న పుస్తకము తెలుగు చదువరులకు అమూల్యమని నా తలంపు.

మన దేశమునకు స్వాతంత్ర్యము లభించుటకు నలువది వత్సరములు ముందే, జాతీయపతాకముయొక్క అవసరము, తన్నిర్మాణ విధానమును గ్రహించి, శక్తికొలది కృషి సల్పి, పత్రికలచేతను, స్వాతంత్ర్యోద్యమ నాయకులచేతను—

ప్రధానముగ జాతిపిత, గాంధీమహాత్ముని చేత—మెప్పునందిన గౌరవము, శ్రీ పింగళి వేంకయ్యగారికి చెందుచున్నది. వారు రచించిన ఆంగ్ల గ్రంథమును నేను చాలకాలముక్రింద జదివి యుంటిని. అంతకుపూర్వమే, మన "కృష్ణాపత్రిక" లో, నేటికి ఇంచు మించు నలువదియైదు వత్సరముల క్రింద, శ్రీ వెంకయ్యగారు అప్పుడప్పుడు ప్రకటించిన వ్యాసములను చదివియుండిన నాకు వారి సేవావిషయములు సుపరిచితములు. జాతీయపతాక నిర్మాణ కార్యమున వారి యత్నములు జయప్రదములగుట ఎవ్వరికైనను సంతోషప్రదములుగా నుండును. ఇప్పుడీ చిన్న పుస్తకమును, తమ తండ్రిగారి యభిమాన విషయమును ముందిడుకొని ప్రచురించుచున్న శ్రీ పరశురామయ్యగారు అభివందనీయులు.

ఈ పొత్తము తెలుగువారి మన్నన నందుగాక !

"ఆంధ్ర కుటీరము,"
హైదరాబాద్,
26-1-1956.

మాడపాటి హనుమంతరావు

# అంకితము

సమస్త మతములకు మూలకంద మేదో,
పారమార్థిక చింతకు పట్టుకొమ్మ ఏదో,
మానవకోటికి ఆధ్యాత్మిక విద్య అందచేసింది ఎవరో,
సకల జాతులకు ఉనికిపట్టు ఏదో,
స్థూల ప్రపంచమునకు సూక్ష్మరూప మేదో,
సకల వ్యాపారములకు ఆటపట్టు ఏదో,
అన్ని పురాతన వస్తువులకు నిలయమేదో,
అన్ని దేశాలకు కూడలి ఏదో,
మునిపుంగవులకు, ఋషిసత్తములకు, పవిత్రస్థాన మేదో,
శతసహస్ర జన్మలు ఎచ్చట జన్మించి ఎవరిని
సేవించుటకు అహర్నిశలు ఆసింతునో,
అట్టి మహామహిమాన్వితమైన నా జన్మభూమికి
శ్రద్ధాంజలితో,

ఈ చిరుపాత్రమును అంకిత మొనర్చుచున్నాను.

---

# కృతజ్ఞత

ఒకజాతి స్వాతంత్ర్యం, సౌభాగ్యం, సంపదా— పతాకంలో ప్రతిబింబిస్తూ వుంటాయి. జాతిలో కనిపించని దివ్య కాంతులే పతాకంలో సగర్వంగా, స్వేచ్ఛగా, ప్రతిబింబిస్తూ వినీలాకాశంలో ఎగురుతూ_విశ్వానికెత్తిన వెలుగు జ్యోతియై ప్రకాశిస్తుంది.

మన భారత జాతీయపతాక పుట్టు పూర్వోత్తరం, ఒక గ్రంథరూపేణా చిత్రించమని నా మిత్రులనేకమంది సలహా యిచ్చారు. ఈ సలహా ప్రకారమే, సాహసించి, నేను యీ రచనను ప్రజానీకానికి అందజేయుచున్నాను.

కేంద్రప్రభుత్వ ప్రచురణ శాఖవారిచే ప్రచురితమైన "మన జండా" ("Our Flag") అను ఆంగ్ల గ్రంథములో వుదహరింపబడని అనేక చారిత్రక విషయములు యిందులో పొందుపరచుటకు ప్రయత్నించాను.

శ్రమ యని ఎంచక, యీ చిన్న పుస్తకమునకు 'తొలి పలుకు' వ్రాసియిచ్చిన "పద్మ విభూషణ్" ఆంధ్ర పితామహ శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారికి నేనెంతయో కృతజ్ఞుడను.

ఈ పుస్తక ప్రచురణలో తోడ్పడిన ప్రియమిత్రులు శ్రీ వుప్పలూరి వెంకటసుబ్బారావు, కందిమళ్ళ సత్యనారాయణ మూర్తిగార్లకు, నా కృతజ్ఞత తెలియజేయవలసియున్నది.

విజయవాడ,
26-1-1956.

పింగళి పరశురామయ్య.

# భారత జాతీయ జండా

## చరిత్ర

---

### జాతీయ పతాక ఆవశ్యకత

పూర్వకాలము నుండీ ప్రతి సంఘానికీ, ప్రతి జాతికీ- ఒక ప్రత్యేక జండా యుండేది. ఈ సంఘం ఫలానిది, యీ జాతి పేరిది అని చూచీ చూడడంతోనే నిర్ధారణ స్ఫురించేందుకు, ప్రత్యేక చిహ్నలను, ఉపయోగించడం, ఎన్ని తరాల నుండియో వస్తోంది. పూర్వపు అనాగరిక జాతులకు కూడా ప్రత్యేక చిహ్నలుండేవి. బట్టలు నేయడం చేతకాని ఆ రోజులలో రంగు రంగుల పిట్టల ఈకలను, తలలోగుచ్చుకోడం ఒక ఆచారంగా యుండేది. తరువాత ఆయా జాతులు ఉపయోగించే బల్లెముల మీాద వారికుల దైవాలను, పవిత్ర జంతు సంతానాన్ని, చెక్కించుకొని వానినే చిహ్నంగా వాడుకొనేవారు. కాలక్రమేణ బట్టలు నేయడం నేర్చుకున్నప్పటి నుండీ, ప్రతి జాతీ, తమ ప్రత్యేక చిహ్నములను పలుచటి రంగు గుడ్డ మీాద చిత్రించి, ఒక కర్రకుగాని, స్తంభానికిగాని, తాడుకు గాని, ఒక ప్రక్కను గట్టి, రెండో ప్రక్క గాలిలో రెప రెప లాడుతూండేట్లు చేసేవారు. దీన్నే మనం జండా అంటాం. ప్రతి జాతికీ యీ జండా అనేక విధాలుగా యుపయోగ పడుతుంది. ఈ జండాను, అనేకవిధాలైన గుర్తులివ్వటానికి

ఉపయోగించవచ్చును. పండుగలకీ, ఉత్సవాలకీ, సుఖ దుఃఖాలకీ, ఈ జండాను అనేక రంగాలలో, అనేక రీతులుగా, ఎగుర వేయవచ్చును. జండా చూడగానే జాతి చిహ్నాలు, మనకు చప్పున జ్ఞాపకం రావాలి; యిదే జండా యొక్క ముఖ్యోపయోగం. సైన్యానికీ, నౌకా బలానికీ, ప్రత్యేక చిహ్నంగా కూడా జండా యెంతో ఉపయోగపడుతుంది.

ప్రతి జాతికీ, దాని సంస్కృతి కనుగుణ్యమయిన ప్రత్యేక జండా యుంది. ఆ జండా కెంతో ఘట్టు పూర్వోత్తర ముంటుంది. ఒకానొకప్పుడు అమెరికా సంయుక్తరాష్ట్రాలు, ఇంగ్లీషువారికి, వలసరాష్ట్ర దేశంగా వున్నాయి. అప్పుడు ఆ దేశానికి ఇంగ్లండు దేశపు జండా వుండేది. కాని, అమెరికాకు స్వాతంత్ర్యం వచ్చిన తరువాత, మరొక క్రొత్త స్వాతంత్ర్య పతాకాన్ని చిత్రించుకోవలసి వచ్చింది.

ఈ విధంగానే, పాశ్చాత్య శృంఖలాలనుండి, భారత జాతిని విడిపించాలంటే దానికొక ప్రత్యేక జండా వుండాలనడం నిర్వివాదాంశం. ఆ జండా భారతీయ సంస్కృతినంతనూ ప్రతిఫలింపజేస్తూ, ఆసేతు హిమాచల పర్యంతం ప్రతి వారి హృదయంలోను, స్వాతంత్ర్య పిపాస, జాతీయత రేకెత్తించాలి. జండాను చూస్తే ప్రతి భారతీయుడు చేయెత్తి కొలిచేటంతటి భక్తి, శ్రద్ధలు కలగాలి. భిన్నభాషలు, భిన్నమతాలు, కొల్లలుగావున్న విశాల భారత దేశంలో, సమష్టి చేకూర్చగల జండా కావాలి. ఖండాంతరాలలోగూడా భారతజాతి ఖ్యాతిని, వేనోళ్ళ చాటి విజయాన్ని చేకూర్చ గలిగినదిగా వుండాలి.

## భారత జాతీయ పతాకకు నాంది

భారత స్వాతంత్ర్య పోరాటం ప్రథమ దశలో వున్నప్పుడు, మనకొక ప్రత్యేక జాతీయపతాకంలేదు. జాతీయ సమావేశాలలో కూడా, పరాయిదేశపు పతాకాలను ఉపయోగించే వాళ్ళం.

1905 సం॥ లో మాత్రం మేడం కామా, తదితర భారతీయ దేశభక్తులు, పారిస్ నగరంలో సమావేశమయి, ఆకుపచ్చ, కుంకుమ పువ్వురంగు, ఎరుపులతో కూడిన ఒక త్రివర్ణ పతాకాన్ని తయారుజేసి, అదే సంవత్సరం బెర్లిన్ నగరంలో జరిగిన ఒక సమావేశంలో ఎగుర వేశారు. ఎందువల్లనోగాని, ఇది ఎవరినీ ఆకర్షించ లేక పోయింది.

1907 సం॥ లో ఆంధ్రదేశంలో, మచిలీపట్టణ వాస్తవ్యులైన పింగళి వెంకయ్య గారు మాతృదేశానికొక ప్రత్యేక జండా చిత్రించాలని పూనుకున్నారు. అప్పటినుండీ జాతీయ జండా ఎట్లాంటిదై యుండాలనే సమస్యనే తమ అభిమాన విషయంగా పెట్టుకొని దీన్ని గురించి దేశంలో ప్రచారం ప్రారంభించారు. 1913 నుండీ, ప్రతిజాతీయ మహాసభకూ హాజరై, నాయకులందరితోనూ జాతీయ పతాక ప్రతిష్ఠాపనను గురించి చర్చలు సాగించారు. 1914 సం॥ లో యీ ముఖ్యవిషయాన్ని కీర్తికాయులైన బ్రజేంద్రనాథ్ సేన్, రవీంద్రనాథ్‌టాగూర్, జె. సి. బోస్, పి. సి. రే, అషుతోషు

ముఖర్జి మొదలగు మేధావులతో ఎంతో విపులంగా చర్చించి, 1916 సం॥ లో "భారత దేశానికొక జాతీయ పతాకం", ('A National Flag For India') అనే గ్రంథాన్ని ఇంగ్లీషులో వ్రాసి ప్రచురించారు.

ఈ గ్రంథానికి అప్పట్లో వైస్రాయి కార్య నిర్వాహక వర్గ సభలో సభ్యులుగానున్న సర్ బయ్యా నరసింహేశ్వరశర్మ గారు ఉత్తేజితమైన తొలి పలుకు వ్రాశారు. వెంకయ్యగారు బందరు జాతీయ కళాశాల ఉపాధ్యాయులుగా నుండగా చేసిన ఈ రచనే నేటి త్రివర్ణ జాతీయ పతాక ప్రతిష్టాపనకు దారి తీసింది. దీనిలో అనేక తరహాల జాతీయ జండాలను వారు పురమాయిస్తూ, మనదేశంలోని, వివిధ మతాల ఆశయాలు, చిహ్నాలు, వాటిలో ప్రతిబింబించేటట్లు ప్రయత్నించారు.

## శ్రీ పింగళి వెంకయ్యగారి జాతీయపతాక నమూనాలు— శ్రీ ముట్నూరివారి ప్రశంస.

కీ. శే. ముట్నూరి కృష్ణారావుగారు, అప్పట్లో తీవ్ర రాజకీయ పత్రికయైన వారి "కృష్ణాపత్రిక" లో (1916 వ సంవత్సరం, డిసెంబరు 2వ తేదీ సంచికలో) యీ గ్రంథమును గురించి "జాతీయ పతాకము" అను యీ క్రింది సంపాదకీయము వ్రాశారు:—

జా తీ య ప తా క ము

"జాతీయ పతాకమను నొక యపూర్వాంగ్లేయ గ్రంధము మా కార్యస్థానము నలంకరించినది. ఈయది ఆంధ్ర

జాతీయ కళాశాలోపాధ్యాయులగు పింగళి వెంకయ్యగారి ప్రణీతము. దీనికి ఆనరబుల్ బైయ్యా నరశింహశర్మగారు పీఠిక ను వ్రాసిరి. హిందూ దేశమునకు వేరుగ నొక జాతీయ పతాకము అవసరమా? అవసరమైనచో నది జనాంగీకారమగుటకు నెట్లు చిహ్నితమై యుండవలెను? యీసమస్య నీగ్రంథకర్త అతి సమర్థతతో నిరూపించెను. జాతీయ పతాకము లేని స్వతంత్రదేశము లేదు. తుదకు బ్రిటిషు సామ్రాజ్యమున కంగీభూతమైన కెనడా, ఆస్ట్రేలియా, న్యూజీలండు వంటి అధినివేశములకు గూడ వేరువేరు ధ్వజములు కలవు.

''అటులనే హిందూ దేశము బ్రిటిషు సామ్రాజ్యాంతర్భుక్తమైయున్నను, ప్రత్యేక పతాకమునేల కలిగి యుండ కూడదు? యీ సంశయమే వెంకయ్యగారి నీయుద్యమమునకు బ్రేరేపించెను. కాని, ముప్పది కోట్ల భారతీయుల సమ్మతిని బడయగల చిహ్నమును గల్పించుట, సామాన్య విషయము గాదు. భిన్న మతములు, వివిధ భాషలు, పలు వేషములు, గల వారికొక సార్వ జనీన చిహ్నమును, గుదుర్చుట యసామాన్య ప్రయత్నమని అంగీకరింపక తప్పదు. ఏ చిహ్నమైనను, అది, దేశ చరిత్రకు, దేశీయ సాహిత్యమునకు, సంబంధించి యుండిన గాని, దానికి మూల్యము లేదు. హిందువులు, మహమ్మదీయులు, బౌద్ధులు, క్రైస్తవులు, పారశీకులు, మొదలగు వివిధ సంఘముల వారెల్లరు గలిసి, మాతృ మందిరము ముందర నొకచో ధ్వజారోహణమును సేయగల దినము లెప్పుడు వచ్చునో,— ఈస్వప్న మేదేశీయుని భావదర్పణమున భాసిల్లకుం

మను? స్వరాజ్యమారుతము వీచుచున్న ఏ ముహూర్తమున వెంకయ్యగారి పతాక సమస్యను జనసమ్ముఖమున బ్రదర్శించి భావాందోళనమును గల్పింపగలిగినందుల కెంతయో వంద్యులు. ఈ గ్రంథముఖమున పలు రంగులలో ముద్రించిన పతాక పటములు, హిందూ దేశముయొక్క ప్రాచీన చరిత్రను, వర్తమాన నవజీవనోన్మేషమును, భావిక ప్రభాజ్యోతిని, ఒక్కమారుగ స్మృతిపథంబున బ్రజ్వరిల్ల సేయగల్గుచున్నవి. భావమును వెలిబుచ్చ గల్గిన దెల్లయు భాషయే. ఆ భాష అక్షరాంకితమై యుండవచ్చు. ఆ భాష రాగ ప్రస్తరితమై యుండవచ్చు. ఆ భాష చిత్రరంజితమై యుండవచ్చు. శబ్దము, గానము, శిల్పము, భావసమాహితులనుగ జేయగల ప్రబలోపకరణములు. పద్మము, శంఖ చక్రము, బౌద్ధ విగ్రహము, శ్యామల వర్ణము, కాషాయాంబరము, చంద్రరేఖ, తారాగణము, ఇంద్ర వజ్రము, త్రిశూలము, శిలువ, సరస్వతి, లక్ష్మి, గోవు, నారికేళము, మయూరము, యింద్ర ధనుస్సు, సూర్య బింబము, ఖడ్గము, హంస, సర్పము, గరుడ పక్షి,— యివి వస్తువులా? భౌతికములా? కావు— ఇవి భావదర్పణములు. ఆదర్శ బింబములు— ఐతిహాసిక చిహ్నములు. జాతీయ రూపకములు. చిన్మయ ప్రతిమలు. వానికీమహాత్మ్య మెట్లు గలిగెనో ఎవరు చెప్పగలరు? అవి చరిత్ర హృదయాంతరాళమునుండి బయల్వెడలిన భావకణములగుటచే నవి, మానవుని హృదయ రాజ్యమున నిరంకుశముగ ప్రభుత్వము చేయగల్గు చున్నవి. శిలువ యన, క్రైస్తవ ధర్మమంతయు. నందు మూర్తీభవించియున్నది. ఎంత స్వార్థనాశనము, ఎంత ఆత్మవిజయము,

ఎంత క్షమ, ఎంత సానుభూతి, ఎంత కృప, ఎంత యజ్ఞము, ఎంత భూతదయ - శిలువయందు చిహ్నితమైయున్నదో క్రైస్తవ సార్థకునికే తెలియును. కమలమునందు యెంత జ్ఞానము, ఎంత విశుద్ధత, ఎంత సౌందర్యము, ఎట్టి రూపలాలన, ఎట్టి ఆనందముకలదో.— హిందూ యోగిని అడిగి తెలిసికొన వలయును. ఆత్మ వికాసమునందు రూపకల్పన ఎట్టి స్థానము వహించునో విశుద్ధతార్కికునకేమి తెలియును? వానికి చిహ్న ములన్నియు కృత్రిమములుగ గన్పట్టును. కాని మానవధర్మ మును నిర్మించుచున్నది, ప్రకాశింప చేయుచున్నది శుష్క తర్కముకాదు. ప్రకృతిని మరుగుచేయుచున్న, మాయా యవనికను తొలగించితిమేని, లక్ష్మి చైతన్యవిలసితయై, రసల హరియై, ఆత్మను అమరధామమునకు గొంపోవుచుండును. మన దైనిక వ్యావహారిక జీవనమును కేవల మంధపరంపరల జిక్కించక, నిత్య నూతన రసరాజ్యమున ప్రతిష్టింప గల్గితిమేని, జాతీయవికాసము త్వరితగతినొందును. బంకిము చంద్రుడు, రవీంద్రుడు, సరోజినీదేవి, మొదలగు కవివరేణ్యులు, జాతీయ భావోద్దీపితములగు కృతులను ప్రకటించిరి. అవనీంద్ర టాగూరు, ధరంధర్,—మొదలగు చిత్రకారులు దేశాత్మను, ప్రబోధింపగల, రూపకములను చిత్రించుచున్నారు. దేశ భక్తులు, వందేమాతర మంత్రమును జపించుచున్నారు. అట్టి రసోజ్వలిత ముహూర్తమున, భారతమాత తన యనుంగు బిడ్డలకు ఒకపవిత్ర పతాక మొసంగకుండునా? ఆ దివ్యదర్శనము కానున్నదని, వెంకయ్యగారి గ్రంథమున, శంఖారావములు గావించిరి. వెంకయ్యగారిందు సూచించిన, పతాకపటములే

జాతీయచిహ్నములై వెలయవలయునని వారి యభిప్రాయము కాదు. జాతీయవిధాతయగు ఈశ్వరుడే యట్టి ధ్వజము నొసగి మోక్ష సామ్రాజ్యము నొసంగగలడు. కాని భక్తులిందుకై వ్యాకుల మనస్కులై యుండవలయును. అట్టి వ్యాకులతను, అట్టి యన్వేషణాసక్తిని, అట్టి భావనా శక్తిని, యీ గ్రంథమునందలి పఠములును, వ్యాసములును బుట్టింప గల్గు నని నిశ్చయముగ జెప్పగలము. నలుబది సంవత్సరముల క్రిందట, బ్రహ్మానంద కేశవ చంద్రుడు, అఖిల భారతీయ పతాక చిహ్నమును చేబూని, జాహ్నవీ తటమున నృత్యము చేసిన ప్పుడు, అవిశ్వాసకులు పరిహాసించిరి. కాని, చంద్రసేనుల స్వప్నము, జాతీయ హృదయమున, దృశ్యాదృశ్యముగ భాసిల్లుచునే యుండెను. ఇప్పుడా స్వప్నము వాస్తవ ప్రపంచ మున మూర్తీభవింప నున్నదను ఆశ కల్గుచున్నది. ఏదైవ ఘటన మూలమున, ఏ వ్యక్తిద్వారమున, ఏ భావముతో, ఏ రూపమున, నెప్పుడు, ద్విత్రింశత్కోటి హస్తములను భారత వర్షీయ ధ్వజ మలంకరించునో!—

"కాని కేతనము బట్టగల పవిత్రతయు, ఐక్యతయు, ప్రేమయు, ధైర్యమును, కార్యదక్షతయు వర్ధిల్లుచున్నవా? దేశీయులు కొంత ఆత్మ పరిశోధనము జేసికొందురు గాక!

"రుమేనియాలో డాన్యూబ్ నదీతీరమున సిలిస్ట్రియా యను గొప్ప దుర్గము కలదు. కడచిన అక్టోబరు మాసారంభ మున జర్మను, అష్ట్రోహింగరీ దుర్గమును ముట్టడించెను. దుర్గ

ముులో నున్న రుమేనియన్ సైనికులు 20,000 మంది ఒక్క మారుగ లోబడవలసి వచ్చెను. శత్రువు విజయదుందుభిని మోగించుకొనుచు, దుర్గద్వారమున ప్రవేశించెను.

"ఇంతలో ఒక రుమేనియన్ వీరుడు, కోట బురుజుపై రుమేనియన్ బావుటా శత్రువు స్వాధీనము కాకుండ రక్షించుటకై దింపుచుండెను. శత్రు సైనికు డొకడు వానిపై బారు విడచెను. అంతట నావీరుని భుజమునుండి రక్తము ప్రవహింప జొచ్చెను. కాని యావీరుడు పతాకమును విడువలేదు. పతాకమును బుచ్చుకొని కోటలోనుండి యెటులనో బయటకు బలాయనుడై, డాన్యూబ్ నదిలో పడెను. డాన్యూబ్ నదిపై శత్రువుల ఫిరంగులనుండి అగ్నివర్షము కురియుచుండెను. కాని ఈ యతిరథుడు జంకలేదు. ఆ పతాకమును, నోట గరచుకొని, భుజములనుండి రక్తము గారుచున్నను, యగ్నిగోళములు నలువైపుల బడుచున్నను, తరంగయుతమై, ప్రవహించుచున్న డాన్యూబ్ నది సంతరణము సేసికొనుచు, ఎటులనో ఆవల బడెను. రుమేనియావారి జాతీయ కేతనము రక్షింపబడినది. కాని యీ యతిరథుడు, రక్తశోషణచే డస్సి వీరశయన మలంకరించెను. అహో! కేతనముయొక్క ప్రభావము అప్రతిహతము. మృత్యువును జయింపగలదు. అమరయశమొసంగగలదు. అఖండ స్వాతంత్ర్య సామ్రాజ్య పదవిని బొందింపగలదు వెంకయ్యగారు, దేశజనని పాదకమలములపై నీ పొత్తము నర్పించి ధన్యులైరి. ఈ పొత్తమును దేశభాషలలో ననువదించుట యుక్తము, అవసరము. ఆంధ్రమహాశయు

లెవరైన నీగ్రంథమును తెలుగులో ముద్రింపించుటకు వెంకయ్యగారికి తగుసహాయ మొనర్చి శాశ్వత కృతజ్ఞతకు బాత్రులగుదురుగాక !! "

## జాతీయ పతాక ప్రచారక సంఘ నిర్మాణం

1917 సం॥ లో కీ. శే. శ్రీమతి ఆనీ బిసెంటమ్మ ఆధిపత్యం క్రింద భారత జాతీయ మహాసభ సమావేశమైనపుడు, హోమ్‌రూలు ఉద్యమం లేవదీయబడింది. ఈ యుద్యమస్థాపకుల యాజమాన్యం క్రింద ఒక జాతీయ పతాక సంఘాన్ని వెంకయ్యగారి ప్రోద్బలంవల్ల స్థాపించారు. సంఘం స్థాపించడం తోనే వారు సంతృప్తిపడక, భారత జాతీయ పతాక ప్రచారక సంఘాన్ని ప్రతిష్ఠాపించి జాతీయపతాకావశ్యకతను ప్రజలకు నచ్చజెప్పారు.

జాతీయపతాకావశ్యకతను గురించి, ఉత్కృష్టతను గురించి ఈ సంఘం క్రింది విషయాలను ప్రచారం చేసింది:—

1. జాతీయ జండా యావద్భారత జాతికీ, ఏకైకదైవంగానూ, లక్ష్యంగానూ, ఉపయోగిస్తుంది.

2. జాతీయ తత్వాన్ని, ఆశయాలను, తనలో ప్రతిఫలింపజేస్తూ, జాతీయైక్యతను ఎంతగానో తోడ్పడుతుంది.

3. ప్రతి భారత పౌరునకు మాతృదేశపు చిహ్నాలను చూపుతూ జాతీయతను పెంపొందింప జేస్తుంది.

4. స్వాతంత్ర్యసమర రంగంలో పిరికిపందలై పారిపో వాచే భారతీయులకు జాతీయపతాకం, రెండింతలు శక్తినీ, ధైర్యాన్నీయగల ఆవేశం రేకెత్తించగలదు.

5. మన జాతీయ పతాక ప్రతిష్టను నిలబెట్టుకోవా లనే దీక్ష యావద్భారత జాతికీ కల్పిస్తుంది.

6. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఏకైక జాతీయ పతాకం ఏవిధంగా భిన్నమతాలను, వివిధ భాషలను, నైక్యత పొందింప జేస్తోందో, అదేవిధంగా మన దేశంలోకూడ జాతీ యైక్యతకు తోడ్పడుతుంది.

7. మనజాతి పూర్వపుటౌన్నత్యాన్ని పదే పదే స్ఫురింప జేస్తూ, పునరుజ్జీవింప జేస్తూ, ఎప్పటికప్పుడు జాతీ యోత్సాహాన్ని ద్విగుణీకృతం చేయగలుగుతుంది.

8. జాతినంతను, త్యాగమూర్తులుగ జేయగల మహత్తర శక్తి పతాకంలో యుంది.

ఈవిధంగా వెంకయ్యగారు మొదలుపెట్టిన అలజడికి, ఎంతోమంది మేధావులు, దేశభక్తులు దోహదమిచ్చి, కొన్ని మార్పులను కూడా సూచించారు.

## ప్రప్రథమంగా జాతీయపతాకావిష్కరణ

1916 సం॥ లో లక్నోలో జరిగిన జాతీయ మహాసభ సమావేశానికి ప్రప్రథమంగా, వెంకయ్యగారిచే తయారుచేయ

బడిన జాతీయజండాను, హోమ్‌రూలు పతాక సంఘమువారు, ఎగురవేశారని డాక్టర్ ఆనీబిసెంటమ్మ సంపాదకత్వంక్రింద నిర్వహింప బడిన "న్యూ ఇండియా" అనే పత్రికలో 1917 సం॥ జనవరి 1వ తేదీన ప్రచురింపబడింది.

## రాట్నచిహ్నం ప్రాముఖ్యత - గాంధీజీ ఆమోదం

1919 సం॥ లో పంజాబ్ కంతకు వయోవృద్ధుడైన జలంధర్ నివాసియగు లాలాహన్సరాజ్ మన జాతీయ పతాకముపైన రాట్నచిహ్నముంటే బాగుండునని పురమా యించారు. అహింసా పద్ధతులమీద మనం స్వాతంత్ర్య పోరాటం సాగిస్తున్నాం కాబట్టి జండామీదకూడా ఆ తత్వాన్ని జ్ఞాపకపరచే రాట్నమే వుండాలని హన్సరాజ్‌గారు చెప్పారు. అప్పటికే భారతజాతినంతనూ, తన సత్యాగ్రహ సమ్మోహనాస్త్రంతో కట్టివేయగల్గిన, మహాత్మా గాంధీగారు కూడా రాట్నచిహ్నమెంతో అనుగుణ్యంగా వుందని అభినం దించారు. కాయకష్టాన్నీ, సౌభ్రాతృత్వాన్నీ, సూచించే రాట్నచిహ్నం జాతీయ జండామీద చూడగానే మన స్వాతంత్ర్య పోరాటం ఏ పంథాలో నడపాలో హెచ్చరిస్తూ వుంటాయి. అందుకే మన జండామీద పులినిగాని, సింహాన్ని గాని, మరేవిధమైన భీకరమైన జంతువునుగానీ చిహ్నంగా వుంచలేదు.

## త్రివర్ణ జాతీయ పతాకావిర్భావం

1921 సం॥లో అఖిలభారత కాంగ్రెస్ కమిటీ బెజవాడలో సమావేశమయినప్పుడు, గాంధీగారు, వెంకయ్యగారిని ఆ సమావేశానికి పిలిపించి, ఎరుపు, ఆకుపచ్చ రంగులు, కలిగి, మధ్య రాట్నంగల ఒక జండాను చిత్రించమని కోరారు. ఆప్రకారంగానే ఎరుపు, ఆకుపచ్చరంగులు గలిగి మధ్య రాట్నచిహ్నంగల జాతీయ జండాను సమకూర్చారు వెంకయ్యగారు.

తదుపరి కొంత ఆలోచనమీద, సత్య, అహింసలకు ప్రత్యక్ష నిదర్శనమైన తెలుపురంగుకూడా వుండాలని గాంధీజీ అభిప్రాయపడి, వెంకయ్యగారు సమకూర్చిన జండాలో అదనంగా తెలుపురంగు చేర్చి, నేటి త్రివర్ణపతాకాన్ని దేశానికి ప్రసాదించారు.

## త్రివర్ణ జాతీయ పతాక - గాంధీజీప్రశంస

1921 సం॥ ఏప్రియల్ 13 వ తేదీ "యంగ్ ఇండియా" సంచికలో గాంధీజీ జాతీయ జండాను గురించి ఇలా వ్రాశారు:

* "...It will be necessary for us Indians to recognise a common flag to live and die for. Mr. P. Venkayya of the National College, Masulipatam, has for some years placed before the public, a suggestive booklet describing the flags of the other nations and offering designs for an Indian National Flag.........

"I have always admired the persistent zeal with which Mr. Venkayya prosecuted the cause of a National Flag, at every session of the congress for the past four years.

"...At Bezwada, I asked Mr. Venkayya to give me a design containing a spinning wheel on a red '(Hindu colour)and green (Muslim colour) back-ground. His enthusiastic spirit enabled me to possess a flag in 3 hours.

"On mature consideration, I saw that the background should represent the other religions also...............

"So, I suggest that the background should be white and green and red. The white portion is intended to represent all other faiths ......."

---

* "ఏకైక జాతీయ పతాకంకోసం తమ సర్వస్వం త్యాగం చేయడానికి సంసిద్ధులై ఉండాలన్న విషయాన్ని మనం విస్మరించకుండా వుండడం ఎంతో అవసరం. మచిలీపట్నం జాతీయ కళాశాలలోని శ్రీ పి. వెంకయ్యగారు లోగడ కొన్ని సంవత్సరాలుగా యితర దేశాల పతాకాలను వర్ణిస్తూ, భారత జాతీయ పతాకమునకు నమూనాలు పురమాయిస్తూ, పుస్తకాన్నొకదానిని భారత ప్రజల కందజేశారు. గత నాలుగు సంవత్సరాలనుండి శ్రీ వెంకయ్యగారు ప్రతి జాతీయ మహాసభ సమావేశంలోనూ, జాతీయపతాక సమస్యను గురించి అత్యంతోత్సాహపూరిత దీక్షతో, సలిపే కృషిని నేను ఎప్పుడూ కొనియాడాను. బెజవాడలో శ్రీ వెంకయ్యగారిని, ఎరుపు (హిందువుల రంగు) ఆకుపచ్చ (మహమ్మదీయుల రంగు) రంగులుగలిగి మధ్య రాట్నము చిహ్నంగాగల జండా ఒకటి చిత్రించి యివ్వమని అడిగాను. వారి అకుంఠిత ఉత్సాహ ఫలితంగా 3 గంటల్లో నేను ఒక పతాకాన్ని పొందగలిగాను. నేను యింకా పూర్తి ఆలోచనమీదట జండాలో యితర మతాలకుకూడా ప్రాతినిధ్యం యివ్వా

# ప్రథమ జండా సత్యాగ్రహం

ఈ విధంగా జననమందిన త్రివర్ణ పతాకం అనతికాలం లోనే ప్రజలలో చైతన్యము కల్గించింది. గాంధీజీ నాయకత్వాన ఎక్కడ చూచినా జాతీయపతాకం ఆకాశ వీధులలో ఎగరడం ప్రారంభించింది. పామర ప్రజలకు జాతీయ పతాకం పట్ల భక్తిశ్రద్ధలు కలిగేందుకు, వారిలో చైతన్యం కలిగేందుకు ప్రతియేడాదీ జండా వుత్సవాలు దేశమంతటా చేయటం ప్రారంభించారు. "హిందువులయెడ నెఱ్ఱనై, ఇస్లామునందున పచ్చనై, తదితరులందున ధవళమై వెలుగొందె జండా" అని ప్రతిమతం వారిలోను పతాకమంటే గౌరవ భావాలను పుట్టించగల్గారు. ఎల్లెడల గలుగుతూన్న యీ జాగృతి జూచి, పశుత్వమే తమ పరమాశయంగా పెట్టుకున్న, పరాయి ప్రభుత్వం కన్నెఱ్ఱ జేసింది. అభం, శుభం తెలియని భారత ప్రజను అనేకవిధాల హింసించ మొదలిడింది. తత్ఫలితమే మొట్టమొదట్లో నాగపూరులో జరిగిన జండా సత్యాగ్రహం. 1923 సం॥ రం మే 1 వ తారీఖున జాతీయ జండాలతో ఒక వూరేగింపు నాగపూరు వీధులలో పోతూంటే, 144 వ సెక్షను క్రింద వూరేగింపును ఆపేసింది ప్రభుత్వం. కాని వలంటీర్లు వినకుండా ముందుకు సాగారు. వారిని అరెస్టుజేసి ఖైదు

---

లనుకున్నాను...... గనుక, జండా తెలుపు, ఆకుపచ్చ, ఎఱుపు రంగులు కలిగియుండాలని సూచిస్తున్నాను. తెలుపు యితర మతాలన్నిటికీ చిహ్నంగా వుంటుంది.

వేశారు. ఈ సందర్భంలో అరెస్టు కాబడిన మొట్టమొదటి స్త్రీ వలంటీరు సుభద్రాదేవి. ఆమె వీరోచిత కృత్యమే దేశం కళ్ళు తెరిచింది. జండా ప్రభావాన్ని కోటిసూర్య ప్రభలతో విరాజిల్ల జేసింది.

భారతప్రజలో చాలమందికి నాగపూరు జండా సత్యాగ్రహంయొక్క అంతరార్థం, ప్రాముఖ్యత బోధపడకపోయినా, ప్రభుత్వంమాత్రం చాలా కలవరపడింది. ప్రజలలో చైతన్యం కలిగి తమ నిరంకుశ ప్రభుత్వానికి అంతరాయం కలుగుతుందనే సంశయం పొడసూపింది. అంతేగాక భారత దేశంలోని అన్నిమతాలకీ ఏకైక జాతీయపతాకం ఏర్పడటం ప్రభుత్వానికి గిట్టలేదు. మొదటినుండీ బ్రిటిషు ప్రభుత్వం "విడదీసి పాలించు" అనే సూత్రంమీద అధికారం చెలాయిస్తూండడం జగద్విదితమే. హిందువులు ఎర్ర జండాను, మహమ్మదీయులు ఆకుపచ్చ జండాను, తదితర మతాలు తెల్ల జండాను ప్రత్యేకంగా ఉపయోగిస్తే పాపం బ్రిటిషువారికి కోపం వచ్చేది కాదు. అందరికీ పనికివచ్చే, అందరి ఆదరాభిమానాలను చూరగొనే జాతీయపతాకం లభించడం బ్రిటిషు సామ్రాజ్యానికే గొడ్డలిపెట్టని ప్రభుత్వం గ్రహించబట్టే, మొగ్గలోనే త్రుంచేద్దామనే ఆశతో నాగపూరు సత్యాగ్రహ సందర్భంలో అంత క్రూరంగా ప్రవర్తించింది. ఈ నాగపూరు జండా సత్యాగ్రహం ఆసాంతం కొనసాగించమని అఖిలభారత జాతీయ మహాసభవారుకూడా నాగపూరు జండా సత్యాగ్రహ సంఘంవారికి కావలసిన సలహా, సహాయంకూడా చేశారు.

ఆనాటినుండి ప్రతినెల 18వ తారీఖు (యిదివరకు గాంధీరోజు అని చేసేందుకు బదులు) జండా రోజుగా ఉత్సవాలు జరుపవలసిందని జాతీయమహాసభ అనుజ్ఞ యిచ్చింది. యీ నాగపూరు జండా సత్యాగ్రహ సందర్భంలోనే సేఠ్ జమ్నా లాల్ బజాజ్ అరెస్టు అయ్యారు. దానితో మరింత సంచలనం కలిగింది. జాతీయమహాసభ యీ విషయంపట్ల మరింత శ్రద్ధ వహించింది. జమ్నాలాల్ మీద వేసిన మూడువేల రూపాయల జరిమానా ఆయన యివ్వనందున, ఆయన కారు నాగపూరులో వేలం వేశారు. కాని ఒక్కపిట్ట పాడలేదు. లాభంలేక ప్రభుత్వం ఆ కారును కతియవార్‌కు తీసికెళ్ళారు. కతియవారుకు తీసికెళ్ళడంలో ఒక అంతరార్థం వుంది. కతియ వారులో అనేక చిన్నచిన్న స్వదేశ సంస్థానాలున్నాయి. వారు బ్రిటిషు ప్రభుత్వానికి తాబేదారులయి, గులాములయి వారి చెప్పు చేతలలో మెలుగుతూంటారు. బ్రిటిషు భారతంలో అమ్ముడుపోని సరుకంతా ప్రభుత్వం యీ సంస్థానాధీశ్వరుల మీద రుద్దడం మామూలు. బ్రిటిషు ప్రభుత్వం అడగడం తడవుగా శిరసావహించడం యీ సంస్థానాధీశ్వరుల విధి. యీ కారణాలవల్ల జమ్నాలాల్ బజాజ్ కారు కతియవారుకు వెళ్ళింది. జాతీయమహాసభ ఆజ్ఞానుసారంగా ప్రతిరాష్ట్రం నుండి వలంటీర్లు నాగపూరు జండా సత్యాగ్రహాన్ని బలపరచ టానికి కొల్లలుగా వచ్చారు. వారు పడిన బాధలు వర్ణనాతీతం.

1923 వ సం॥ జూలై 10వ తేదీనాటికి ఈజండా సత్యాగ్రహ సమస్య అఖిల భారత ఉద్యమంగా మారి, శ్రీయుత వల్లభాయి జె. పటేలుగారిని సత్యాగ్రహనాయకులుగా జాతీయ మహాసభ నియమించింది. భారత దేశంలోని వివిధ ప్రాంతాల నుండి వాలంటీర్లు పంపబడ్డారు. కొన్ని జాతీయ సంస్థలు డబ్బు కోసం ప్రజలను ప్రబోధం చేశాయి. 1923 ఆగష్టులో విశాఖ పట్టణంలో సమావేశమయిన అఖిల భారత జాతీయ మహాసభ కార్యనిర్వాహక వర్గంవారు, పటేల్ భాయీలు నాగపూరు సత్యాగ్రహోద్యమాన్ని ఎంతో నిపుణతతో నడపడాన్ని అభినందిస్తూ, అది ఆసాంతమయ్యేవరకు వారినే నాయకులుగా నియమించారు. "పటేల్ భాయీల నిరంతర కృషి ఫలితంగానే నాగపూర్ సత్యాగ్రహం విజయవంతమైందని చెప్పాలి" అని డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు వ్రాసిన అఖిల భారత జాతీయమహాసభ చరిత్రలో ఉద్ఘాటించారు. ఈ నాగపూరు జండా సత్యాగ్రహం, దేశాని కెంతో గొప్పగా తోడ్పడింది. ఈసత్యాగ్రహంతో పతాక ప్రభావం భారత దేశపు మూరు మూలలకు ప్రాకింది. నాగపూర్ జండా సత్యాగ్రహంలో సర్వ కష్టాలకోర్చి, అనేక అవమానాలకు గురియై పతాక ప్రతిష్టను మన వాలంటీర్లు నిలబెట్టడంతో జండాకొక పవిత్రత, సార్వజనీనత ప్రాప్తించింది. అంత వరకు త్రివర్ణ పతాకాన్ని జాతీయపతాకంగా ఉపయోగించడానికి విముఖత్వం చూపిన వారు గూడా దాని మహాత్మ్యం ముందు లొంగి పోయారు.

# సిక్కుల పేచీ

ఈ విధంగా త్రివర్ణ పతాక యుత్కృష్టతను ఎప్పటి కప్పుడు ప్రజలలో ఉద్బోధిస్తూ, దానియెడల ప్రజాసామాన్యా నికి గౌరవ ప్రపత్తులు కలిగేటట్లు ప్రచారం జరిగింది. అయిన ప్పటికీ మనదేశంలో అనేక మతాలున్నాయని మనం విస్మ రింపరాదు. అన్ని మతాలకు జండాలో చోటువున్నదా లేదా అన్న విషయం కొన్ని మతాలవారిని వేధిస్తూండేది. మరి సిక్కులదే గొప్ప పేచీ వచ్చి పడింది. వారికుండే సైనిక ప్రాముఖ్యతవల్ల జాతీయజండాలో వారికి ప్రియతమమగు నల్లరంగు యిమిడ్చితీరాలని అనేక సిక్కుసంస్థలు అలజడి చేసినవి. 1930 వ సం॥ న లాహోర్ లో పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ఆధిపత్యం క్రింద జరిగిన అఖిల భారత జాతీయమహాసభ సమావేశంలో సిక్కు సంస్థలు త్రివర్ణపతాకమునెడల తమ అసంతృప్తిని తెలిపారు. జవహర్ లాల్ వాటినన్నిటినీ శాంతంగా విన్నారు. కాని 1930 లో గొప్ప సత్యాగ్రహోద్యమం లేవదీయబడడంవల్ల యీ పతాక సమస్యకంత ప్రాముఖ్యత అప్పట్లో యివ్వడానికి వీలులేదనీ, స్వాతంత్ర్య పోరాటం క్లిష్టదశలో నున్నప్పుడు సౌభ్రాతృత్వం అవసరమనీ, జవహర్ సిక్కులను శాంతింపజేశాడు. 1930 లో జరిగిన సత్యాగ్రహోద్యమం, మార్చి 1931 లో అయిన గాంధీ – ఇర్విన్ ఒడంబడికతో ముగిసింది. దానితో 1931 లో కరాచీలో జరిగిన అఖిలభారత జాతీయమహాసభ సమా

వేశంలో మళ్ళీ సిక్కులు పతాకపు రంగులను గురించి ఆందో ళన సాగించారు. సిక్కు నాయకుల కోరికలను కూలంకష ముగాచర్చించి నిర్ణయాలకు దిగడంకోసం అఖిలభారత జాతీయ మహాసభవారు ఒక ఉపసంఘాన్ని నియమించారు. ఈ ఉపసంఘం కావలసిన ప్రమాణాలనన్నింటినీ పరిశీలించి జూలై 1931 లో తమ నివేదికను జాతీయమహాసభకందజేశారు. ఈ సంఘం చేసిన సిఫార్సుల ననుసరించి జాతీయ జండాకు కుంకుమపువ్వు రంగు, ఆకుపచ్చ రంగు, తెలుపురంగు వుండాలనీ, రాట్నమే చిహ్నంగా ఉండాలనీ అఖిలభారత జాతీయమహాసభ నిర్ణయించింది. ఈ రంగులకు అదివరకు దాకావుండే మత సంబంధమైన అంతరార్థాలకు బదులు, సత్యము, శౌర్యము, శాంతము అనే మానసిక గుణాలపరంగా పతాకోత్కృష్టతను ప్రజలకు నచ్చజెప్పాలనీ, రంగులు మతాలను తెలుపుతున్నాయని చెప్పడంవల్ల మనదేశంలో ఉండే వివిధ మతాలను ఐక్యపరచే బదులు ఇంకా విడదీసినవాళ్ళమవుతామనీకూడా అఖిలభారత జాతీయమహాసభవారు ప్రబోధించారు.

## త్రివర్ణపతాక అంతరార్థం

కుంకుమపువ్వురంగు శౌర్యాన్ని, త్యాగశీలాన్ని ప్రతిబింబింప జేస్తుందని, ఆకుపచ్చరంగు అకుంఠిత భక్తి విశ్వాసాలను, శూరత్వాన్నీ, చాటుతుందనీ, తెల్లరంగు

మన స్వాతంత్ర్య పోరాటానికి ప్రాతిపదికలైన సత్యము, అహింసలకు ప్రత్యక్ష నిదర్శనమని వివరింపబడింది. ఈ రంగులపైన గిరున తిరిగే రాట్నం గ్రామజీవనాన్ని, రైతు, కార్మికత్వాన్ని స్ఫురింపజేస్తూంటుంది. అంటే కార్మిక, కర్షకులపై ఆధారపడిన మనదేశం, సత్యము, అహింసలపై ఆధారపడిన త్యాగమువలన సుభిక్షముగా నుండవలెనని మన ఆశయము. ఈ ఆశయచిహ్నమే మన త్రివర్ణ పతాకము.

## భారత రాజ్యాంగ సభలో పతాక తీర్మానం

ఈ పతాకాన్ని అవసరానికి మాత్రం ఉపయోగించు కుంటున్నా, 1947 వ సం॥ జూలై 22 వ తేదీన గాని భారత రాజ్యాంగ సభలో తీర్మానరూపం దాల్చలేదు. ఈ తేదీన నెహ్రూ జాతీయ జండాను గురించి రాజ్యాంగ సభలో ఒక తీర్మానం తీసికొనివచ్చి, మునుపటి త్రివర్ణ జండాలోని రాట్నం మాత్రంవదలి, దాని బదులు అశోకుని ధర్మచక్రం చిహ్నంగా యిమిడ్చారు. చిహ్నం మార్పు తప్పితే, నేటి జండాకు, మునుపటి జండాకు తేడా ఏమీలేదు. నేటి పతాకం లోని అశోకుని ధర్మచక్రం, భారతదేశ పూర్వ సంస్కృతికి, అది ఆరాధించిన అనేక ఆదర్శాలకు సంకేతం. ఈమార్పుతో కూడిన పతాక తీర్మానాన్ని రాజ్యాంగ సభలో ప్రతిపాదిస్తూ జవహర్‌లాల్ నెహ్రూ ఇలా అన్నారు. "ఈ పతాకం – ఒక సామ్రాజ్య పతాకం కాదు. సామ్రాజ్యవాద సూచకంకాదు. ఎవరినైనా ఆక్రమించే విధానాన్ని సూచించే కేతనంకాదు.

ాని, యిది మనకేకాక దీన్ని దర్శించే స ర్వ ప్ర జ ల కు
్వాతంత్ర్యవ్నాం. ఇది నా ఆశ, నా విశ్వాసం. అంతేకాదు.
ఈ పతాకం, దూరదేశాల్లో భారతీయులు నవసిస్తున్న ప్రదే
ాలకు రాయబారులు, మంత్రులు ఉండే చోట్లకు మాత్రమే
ాక భారత నౌకలతో అనంతసముద్రాలపై విహరిస్తుందని నే
ాశిస్తున్నాను. ఆవిధంగా యీ పతాకం ఎక్కడకు వెళ్ళినా
ంహృద్భావ సందేశాన్ని, భారతదేశం ప్రపంచంలో ప్రతి
దేశంతోనూ, స్నేహంగా వుండాలని వాంఛిస్తోందనీ, ఎక్కడ
ప్రజలకు స్వాతంత్ర్యం లోపించినా వారికి భారతదేశం సహా
యం చేయాలని కోరుతోందని మహత్తర సుహృద్భావ సందే
ాన్ని అందిస్తుందనీ నేను విశ్వసిస్తున్నాను.

" ఈ జండాను అనేకు లనేకవిధాలుగా వర్ణించారు.
వరికొందరు దీన్నిచూచి మతదృష్టితో అపార్థం చేసి
ొన్నారు. ఇందులో ఆయా భాగాలు ఏవేవో మతాలకు
ంహ్నలని వారభిప్రాయపడ్డారు. కాని, ఈ జ ం డా ను
ముదట్లో నిర్ణయించినప్పుడు అటువంటి మతదృష్టితో నిర్ణ
యంపబడలేదు. ఒకదేశంయొక్క చిహ్నం చూడడానికి అం
ంగా వుండాలి కాబట్టి అందంగావుండే జండాను నిర్ణయించ
ంకోసం మేము ప్రయత్నించాము. సమగ్రంగా చూచినా
విడివిడిభాగాల దృష్ట్యా చూచినా, పతాకం జాతీయస్వభా
ాన్ని, సంప్రదాయాన్ని ప్రతిబింబించేదిగా వుండాలని మే
ంనుకొన్నాం. భారతదేశంలో అనేకవేల సంవత్సరాలుగా

అభివృద్ధిపొందిన స్వభావ సంప్రదాయ దృష్టితో మేమీా పతాకాన్ని నిర్ణయించాము.

"కడచిన సంవత్సరాల్లో మనలో చాలామంది, ఉపయోగించిన పతాకానికీ దీనికీ స్వల్ప భేదాలున్నాయని మీరు గమనించి వుంటారు. రంగులన్నీ అవే - కుంకుమ పువ్వు రంగు, తెలుపు, ముదురాకుపచ్చ; భారత దేశంలో సామాన్య మానవునకూ, సర్వప్రజానీకానికీ, వారిపరిశ్రమకూ సంకేతమై, యీదేశానికి మహాత్మా గాంధీ అందించిన మహత్తర సందేశం మూలంగా మనకు లభించిన రాట్నచక్రం, పూర్వం దీని మీాద ఉండేది. ఆ ప్రత్యేక చక్రాచిహ్నం యీా పతాకంలో కొద్దిగా మార్పు పొందింది. యెందుకీమార్పు? దీనికి సమాధానం సామాన్య ధోరణిలో యీావిధంగా చెప్పవచ్చు. జండా మీాద ఒక వైపు వుండే చిహ్నం రెండోవైపుకూడా అదే విధంగా వుండాలి. అల్లా వుండకపోతే ఒక కష్టంవున్నది. అది పతాక నిర్ణయ సిద్ధాంతాలకు విరుద్ధమని చెప్పవచ్చు. యీా జండామీాద యిదివరలో కనుపించిన విధంగా చక్రాను చూస్తే ఒకవైపు చక్రము, మరొక వైపు కదురువుండేది. ఆబొమ్మనే జండాకు రెండోపక్క వేస్తే, కదురు మరొక వైపుకు, చక్రం యింకొక వైపుకు వెళుతుంది. అంటే రెండు వైపులచిహ్నాలు ఒకదాని కొకటి వ్యత్యస్తంగా వుంటాయి. అల్లాకాకుండా చేద్దామంటే ఒకవైపు చిహ్నంలో విరుద్ధంగా వస్తుంది. రాట్న చక్రం జండా కర్రవైపు ఉండాలిగాని గుడ్డ అంచు వైపు ఉండగూడదు.

"ఈవిధమైన శాస్త్ర విషయక ప్రత్యక్ష ప్రతిబంధకం ఒకటి వచ్చింది. నిద్రాముద్రితులైన భారత ప్రజలను మేల్కొల్పిన యీమహోన్నత చిహ్నం ఉండి తీరాలని మేము నమ్మాము. కాబట్టి దాన్ని కొంచెం మార్పుచేసి ఉపయోగించాలని నిశ్చయించుకున్నాము. "చక్రం అక్కడవుండి తీరాలి. యీ యిబ్బంది తెచ్చి పెట్టిన మిగిలిన భాగంవద్దు" అనుకొన్నాము. చర్ఖాలో ముఖ్యమైన భాగం చక్రం అక్కడ వుండితీరాలి. ఆ విధంగా చర్ఖా సంకేతమైన చక్రం ద్వారా పూర్వసంప్రదాయం అల్లా వున్నటూనే వుంటుంది. అయితే యెటువంటి చక్రం వుండాలి?

"అశోకుని ధర్మ చక్రం భారతదేశ పూర్వ సంస్కృతికే కాక అది ఆరాధించిన అనేక ఆదర్శాలకు కూడా సంకేతంగా వున్నది. అందుచేత ఏదో ఆ చక్రము, యీ చక్రము వుండడం కంటె యిందులో అశోకుని ధర్మ చక్రమే వుంటే బాగుంటుందని మేము భావించాము. నా మట్టుకు నేను మన యీ పతాకంలో యీసంకేతాన్నే కాక, భారతదేశ చరిత్రలోనూ ప్రపంచ చరిత్రలోనూ కూడా మహా పురుషుడైన అశోకచక్రవర్తి నామాన్ని కూడా పరోక్షంగా అనుసంధించగలిగినందుకు చాలా సంతోషిస్తున్నాను."

తరువాత రాజ్యాంగ సభవారు నెహ్రూ ప్రవేశపెట్టిన యీ క్రింది తీర్మానాన్ని ఆమోదించారు.

# తీర్మానం

"కుంకుమ, తెలుపు, ముదురు ఆకుపచ్చ, యీ త్రివర్ణముల సమభాగములో భారత జాతీయ పతాకముండాలి. తెల్ల పట్టీ మధ్య నీలివర్ణములో, చరఖాసూచకముగ ఒకచక్రం ఉండాలి. సారనాథ్ సింహధ్వజ పీఠముమీదనున్న అశోక ధర్మచక్రంబోలి యీ చక్రం వుండాలి. తెల్లపట్టీ వెడల్పునకు తగినట్లు ఈ చక్రమును చిత్రించాలి. పతాకపు పొడవు 3 వంతులను, వెడల్పు దామాయిషాగా రెండువంతులుండాలి".

## పతాకముపట్ల చూపించవలసిన గౌరవము

జాతీయపతాకమును, ప్రపంచమంతా ఉచితపద్ధతిలో గౌరవిస్తుంది. భారతదేశంకూడా ఈ విధానాన్ని పాటిస్తోంది. దీనికిగాను ప్రభుత్వం కొన్ని నిబంధనలను యేర్పాటు చేసింది.

ఇతర దేశాధిపతులవలెనే, భారత రిపబ్లిక్ అధ్యక్షుడు ఎక్కడవున్నా వారి స్వంత ప్రత్యేక పతాకాన్ని జాతీయపతాకముతోబాటు ఆవిష్కరిస్తారు.

ఇదేవిధంగా గవర్నర్లు, రాజప్రముఖులు, తమ తమ స్వంత పతాకాలను వుంచుకొనవచ్చును.

ఒకేవరసలో ఈ పతాకాలు వ్రేలాడుచున్నప్పుడు పతాకాలన్నీ జాతీయపతాకానికి ఎడమవైపున వుండాలి. ఆవిష్కరించినప్పుడు జాతీయపతాకం వాటికంటె ఎత్తున వుండాలి.

ఊరేగింపులో ప్రదర్శించినప్పుడు, ఊరేగింపు ముందర, వాహకుని కుడిభుజముపైన జాతీయపతాకం ఉండాలి.

ఇతర పతాకములతో జాతీయ పతాకము ఆవిష్కరింపబడినపుడు జాతీయపతాకమే ముందుగా యెగురవేయాలి; చివరకు దించాలి. ఇతర పతాకములు యెగురుచుండగా జాతీయపతాకము ఎప్పుడూ దించరాదు. సైనికదళాలలో జాతీయపతాకము, సైనిక పతాకము, తెలుపుపతాకము కాని (లేక) భారత వైమానికదళ పతాకము ఒకేసారి యెగురవేసి ఒకేసారి దించాలి.

ఒక సమావేశమందు ఉపన్యాసకుని వెనుకభాగమందు ఆయన తలకు పైగాను, యితర అలంకారములకు పైగాను జాతీయ పతాకమును ఆవిష్కరించాలి.

జాతీయ పతాకముపైన యేమీ వ్రాయకూడదు. ఉపయోగించటానికి పనికిరానప్పుడు దానిని బహిరంగంగా పాడు చేయకూడదు. గుడ్డ పీలికగా ఉపయోగించకూడదు, చెత్త చెదారంలో పారవేయకూడదు.

జాతీయ పతాకాన్ని అలంకరణగా యెన్నడూ ఉపయోగించ కూడదు. సభలు, సమావేశాల్లో ఉపన్యాసకుని ముందు బల్లమీద జాతీయ పతాకము పరచకూడదు. చీరెల అంచుగా కాని, నమూనాగాకాని, మరే యితర వ్యాపారము నకుగాని ఉపయోగించకూడదు. ఒక్కమాటలో చెప్పాలంటే, పతాకంగానే ఉపయోగించాలి కాని యితరత్రా యెన్నడూ

ఉపయోగించ కూడదు. ట్రేడుమార్కుల చట్టం 69 వ సెక్షన్ ప్రకారం యేవ్యాపారములోగాని, వర్తకంలోగాని, వృత్తిలో గాని జాతీయ పతాకాన్ని వాడ కూడదు. ప్రజలీ పవిత్ర భావాన్ని గౌరవించాలి.

ఈ క్రింది నియమాలను పాటించవలసినదిగా దేశీయ మంత్రిత్వశాఖ ఒక ప్రకటన కావించినది.

1. కేంద్రరాష్ట్ర ప్రభుత్వపు ప్రధాన భవనాలమీద అంటే హైకోర్టులు, శక్రటేరియట్ కార్యాలయాలు, కమీషనర్ల కార్యాలయాలు, కలెక్టర్ ఆఫీసులు, జైళ్ళు, జిల్లా బోర్డులు, మునిసిపాలిటీలు మొ॥ భవనాలమీద సహజంగా జాతీయపతాకాన్ని యెగురవేయాలి.

2. అన్నిసరిహద్దు ప్రాంతాలలోను యేదో ఒక స్థలంలో జాతీయపతాకాన్ని యెగరవేయవచ్చు.

ఈ క్రింద నుదహరించినవారు, వారు నివసించేచోట జాతీయపతాకాన్ని ఆవిష్కరించుకునే హక్కు వుంది.

1. కేంద్రరాష్ట్ర ప్రభుత్వపు మంత్రులు, స్పీకర్లు;

2. పై శాసనసభలు ఎక్కడవున్నా ఈ సభల అధ్యక్షులు;

3. కేంద్రప్రభుత్వ ఉపమంత్రులు;

4. ప్రాంతీయ కమీషనర్లు, ఛీఫ్ కమీషనర్లు, డిప్యూటీ కమీషనర్లు, కలెక్టర్లు;

5. రాష్ట్ర గవర్నర్లు వారి స్వంత పతాకాన్ని ఉంచుకోవచ్చును. దీనిమీద రాష్ట్రపు పేరుకాని, రాష్ట్ర చిహ్నంకాని చిత్రించవచ్చును. రాష్ట్రంలో పర్యటించేటప్పుడు వారుండే భవనాలమీద, వారు యెక్కడ ఆగితే అక్కడ ఆ పతాకాన్ని ఆవిష్కరించవచ్చును.

6. రాజప్రముఖులువారుండే భవనాలమీద, యిష్టానుసారం, జాతీయ పతాకంతోపాటు ఆయారాష్ట్ర పతాకాన్ని కూడా ఆవిష్కరించవచ్చు.

7. విదేశాలలోవున్న భారత ప్రభుత్వ ప్రతినిధులు, వారి కార్యాలయాలలో నివసించునప్పుడు వారుండే భవనం మీదా, కార్యాలయంమీదా, జాతీయపతాకాన్ని ఆవిష్కరించాలి.

8. రాష్ట్రపతికానీ, (లేక) ప్రధానికాని, (లేక) ఉపప్రధానికాని ఒకరాష్ట్రంలో పర్యటించే టప్పుడు ఆ రాష్ట్ర గవర్నరు ప్రభుత్వ భవనంలో వుండవలసి వస్తే ఆయన ప్రత్యేక పతాకం, (లేక) ప్రధానికాని, ఉప ప్రధాని కాని అయితే, జాతీయ పతాకం గూడ ప్రధాన భవనంమీదకాని, (లేక) ఒకభాగంలో వుంటే ఆ భాగంపైకాని (లేక) భవనం ముందుభాగంలోకాని, (లేక) సింహద్వారంమీదకాని, ఆవిష్కరింపబడాలి.

(A) గవర్నరు తన రాష్ట్రంలో పర్యటన భవనంలో వుంటే రాష్ట్రపతి, ప్రధాని (లేక) ఉపప్రధానికూడా ఆ

భవనంలోనే అతిథిగా వుండవలసివస్తే పైన పేర్కొన్న ఆచారాన్ని పాటించాలి.

(B) రాష్ట్రపతి, ప్రధాని (లేక) ఉపప్రధాని ఒక రాష్ట్రంలో గవర్నరు ఉండని పట్టణంలో ఉండవలసి వస్తే, వారుండే భవనంమీద కాని, ఒక స్థంభంపైనకాని, లేక పతాక స్థంభంపైనకాని, జాతీయ పతాకాన్ని ఆవిష్కరించాలి.

(C) రాష్ట్రపతి, ప్రధాని (లేక) ఉప ప్రధాని ఏ తరగతి రాష్ట్రంలో పర్యటించినా, పై ఆచారాన్నే పాటించాలి.

9. స్వతంత్ర దినోత్సవాల్లో జాతీయవారము, 26 వ జనవరి, మహాత్మాగాంధి జన్మదినం, మొ॥ జాతీయ మహోత్సవాలలో జాతీయ పతాకా విష్కరణకు యీా నియమాలు వర్తించవు.

## కార్లమీాద జాతీయ పతాకా విష్కరణ

1. మంత్రివర్గ సభ్యులు, ఉపమంత్రులు, కేంద్రరాష్ట్ర స్పీకర్లు, ఛీఫ్‌కమీాషనర్లు, ప్రాంతీయ కమీాషనర్లు విదేశాల్లో నున్న భారత ప్రభుత్వ ప్రతినిధులు, వీరి కార్లమీాద జాతీయ పతాకాన్నెగురవేయవచ్చు.

2. కేంద్ర ప్రభుత్వ డిప్యూటీ మంత్రులు.

3. గవర్నర్లు రాజప్రముఖులు యిష్టానుసారం వారి రాష్ట్ర పతాకాలతోపాటు, జాతీయ పతాకాన్నికూడ యెగర వేయవచ్చును.

4. రాష్ట్రపతికి, గవర్నర్లకు, వారి స్వంత ప్రత్యేక పతాకాలు వుంటాయి. గవర్నర్లు వారి రాష్ట్రాల బయట జాతీయ పతాకాన్ని ఎగరవేయాలి.

5. ఉన్నత శాసన సభల అధ్యక్షులు.

## పతాకం యెగర వేయటం — దించటం

(ఎ) సామాన్యంగా సూర్యోదయం మొదలు సూర్యాస్తమయం వరకు, జాతీయ పతాకం యెగురుతూ వుంటుంది. భారత నౌకాదళాలవారు, మాత్రం ఒక నిర్ణీత కాలంలో, అంటే ఉదయం 8 గంటలు మొదలు, సూర్యాస్తమయంవరకు ఎగర వేస్తారు.

(బి) ఒక ప్రధాన వ్యక్తి మరణించి నప్పుడు, లేక జాతికంతకు విచారం కలిగినప్పుడు జాతీయ పతాకాలన్ని, సైనిక పతాకాలతో సహా, పతాకస్థంభము మధ్యకు, పతాకాన్ని దించుతారు.

# పతాకం స్వాతంత్ర్య చిహ్నం

పతాకం ఒక అలంకార వస్తువు కాదు; కంటికిఇంపుగా ఉండు రంగు రంగుల వస్త్రంకాదు; జా తీ య చ రి త్ర లో స్వాతంత్ర్య సమర సన్నివేశాలను, ఆ పోరాటంలో పాల్గొన్న యోధుల చరిత్రను, చేసిన త్యాగాలను, పడిన పాట్లను, సూచించే చిహ్నం.

భారత జాతీయ త్రివర్ణ పతాకాన్ని చూచీ చూడ టంతో స్వాతంత్ర్యం ఎంత అమూల్యమైనదో స్ఫురింప జేస్తుంది. కంటికి కట్టినట్లు స్వాతంత్ర్య సమరం గోచరిస్తుంది; వీర గాధలన్నీ ప్రత్యక్షమవుతాయి; ఒడలు పులకరిస్తుంది; హృదయం, వడివడిగా, స్పందిస్తుంది; మనమానాడు లేక పోతిమే అనిపిస్తుంది; స్వాతంత్ర్యాన్ని దీక్షతో కాపాడాలని పిస్తుంది; భారతజాతీయ పతాకానికి జై ! అని ఆ ప్రయత్నంగా అనిపిస్తుంది.

